శ్రీ

# మతవిఘుతేరితిగఁ బ్రబలినది.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి


కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావుచే

ప్రకటింపఁబడెను.


మొదటికూర్పు.




బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

**1926.**




వెల అ. 0—8—0

# ఆగమలతత్త్వము.

---

## Annalysis of Religion.

మానవుల పలువిధములగు విమర్శనలకుఁ జిత్రమహిమలు జూపువిషయములలో నెల్ల, మతసాంబంధిక విషయ, మతివిచిత్రముగనున్నది. సకలవిధములగు ద్వంద్వప్రకృతులకు స్థానమగు మన శారీరభాగమున నింతయొక ముఖ్యవిషయముఁగనున్నది. కావున, దానితత్త్వమొక విమర్శనవిషయముగ నెవ్వారును నెల్లకాలములందును విచారించుచుందురు. శాస్త్రీకదృష్టిని, నా, మతతత్త్వ యథార్థ్యమును, మన మెఱింగి వెలిబెట్టితిమేని, మనయత్నము, లోకహితముగను, లోకోపకారముగను నుండును. ప్రపంచంబునందు మతములందలిగతులు విచారించు నెడల, నేమార్గ మనుసరించినచో బాగుగనుండుననునది, మనము గనవచ్చును. విమర్శించుటకు మేలుమార్గము దొరకక, యనేకులు పొరబడిన సిద్ధాంతము లొనర్చినారు. తాము విచారించు మతవిషయములో మూలాధారములుగనుండు, తత్త్వముల యాథార్థ్యములు, విమర్శనమునకు నిలుచునవియో నిలువనవియో యనునవి విచారింపకనే వాని, నిజత్వమును నమ్మినారు. కావున వివిధమతములలో నలీకాభిప్రాయములు బుట్టుటకుఁ గారణములైనవి. కొన్ని విషయములు, లనభిశంకనీయములని నమ్మి, వాని, ననుసరించు సిద్ధాంతము లనేకము లొనర్చినారు. స్వర్గకవాటముల మహమ్మదునామము వ్రాయఁబడియుండఁగ "ఇస్లాం" మతమెట్టుల బద్ధమగునని తురకలు వాదింతురు. దైవచోదిత వాక్కులుగల వేదమతమెట్టు లబద్ధమగునని హిందువులు వాదింతురు. అహూర్మజ్దను మహాదైవము పలికిన మతవచనములెట్టుల లీకములగునని పార్శీలు వాదింతురు. దేవునిపుత్రుఁడు క్రీస్తువచనముల, నిజత్వమునకు, వేఱొకటియుండునాయని క్రీస్తుమతస్థులు వాదింతురు. ఇటులనే యనేక మతములవారు మత ముఖ్యాంశమును, విమర్శింపక నమ్మి, యనేకానర్థములకుఁ గారణభూతులయిరి. తాము నమ్మినవిషయము నిర్వివాదాంశమా, యటుగాక వివాదాంశమా యనునది విమర్శనాపూర్వకముగ విచారింపరైరి. తాము బలీయమగు సాక్ష్యముపైన మత ముఖ్యాంశములను నమ్మినారా యటుగాక దుర్బలములగు సంశయములపైన నమ్మినారా, యేవిచారమునుఁ జేయక గుడ్డివారింబలె నమ్మినారా, యను విషయమునుగూడ నాలోచింపక సిద్ధాంతము లొనర్చు వారనేకులున్నవారు. మతసిద్ధాంతము లొనర్చిన జ్ఞానులు తామని గర్వించినారు. అట్టి వారు

సిద్ధాంతము లంద అనుసరింపవలెనని కలహించుచున్నవారు. ఇతరులకంటెను జ్యూలధికులనియు, వారికి దైవానుగ్రహము సంపూర్ణముగఁ గలిగియుండెను కావున యీజిప్షనుల భాధలనుండి పురాతన "యిజర్లైట్సు" తప్పించుకొనిరనియు హీబ్రూలు పలుకుచున్నవారు. అన్యమతస్థు లనేకులు తాము పడరాని బాధలు పడు సమయమున తమదైవములు ఆ బాధలనుండి తమ్ముఁ గాపాడిరని గాథలువచించుచుఁ దామధికులమనుచున్నవారు. వృత్ర శంబరాద్యసురులున్ను దస్యులున్ను బాధించు నపుడు తమ దైవములగు నింద్రవరుణాగ్నులు వారినిఁ జంపి తమ్ముఁ గాపాడిరని యార్యులు పలుకుచున్నవారు. అనేకవిధములగు భూతములు ప్రపంచమును బాధించుచుండఁ దమదైవమగు నహూర్మజ్దా బహువత్సరంబులు వారితోఁ బోరి జయించి తమ్ముఁగాపాడెనని యీరానీలు పలుకుచున్నవారు. వివిధ మతచరిత్రములు చదివి నట్టెల్లను నిట్టిగాథలుండును కావున నిట్టి దుర్బలంబులగు సాక్ష్యములనుబట్టి మతాధిక్యత నిర్ధరించుటకు నాధారములులేవు. కానరావు. ఒకమతమువారు తమ, మతమధికమనుటకు బలమైన కారణములు చూపి వాదించుతటి నన్యమతస్థులుసైత మవేకారణములు తమమతమునందుసైత మున్నవని స్థిరపఱచిన యెడల మొదటి వారి మతప్రాముఖ్యతకుఁ గుందుకలుగును. కావున ప్రకృతిశాస్త్రమునందును భాషా విషయకమగు శాస్త్రమునందును నుపయోగింపఁబడు పోల్పుమార్గ మవలంబింప వలెను. అనగా రెండువస్తువు లెదుటనుంచికొని వానియందు సామాన్యముగనుండు తత్త్వములెవ్వి యధికముగనుండు నవి యెవ్వియనునది విమర్శింపవలెను. అటులొనర్పనిచో మతగౌరవముల తరతమములు తెలియుట కష్టమగును. శబ్దతాత్త్వికుఁడు వివిధభాషల సామాన్యతను నెఱుంగుటకునై, యాయాభాషలలో సమానార్థ మిచ్చు శబ్దముల నెదుటనుంచుకొని వానికి మూలాధారములుగనుండు ధాతువు లనుబట్టి యేయేశబ్దముల యందొక్క ధాతువే యాధారముగ నుండునది కనుక్కొని యాశబ్దములన్నియును నొక్కతరగతిక్రిందఁ జేర్చువిధమున మతతాత్త్వికుఁడుసైత మదేపద్ధతి ననుసరించినచో నేయేమతములకు నైకమత్యముగలదు. మఱి యేయే మతములు వానితోఁ భిన్నించునను విషయముఁ గొంతవరకు నిర్వివాదముగ నిర్ధరింపనగును. అయినను మూలాధారమగు దైవతత్త్వము నిర్ధరించుట యసాధ్యము.

ప్రాపంచక స్థితియును బ్రాపంచక చరిత్రయును జూచినమాత్రాన నొక విచిత్రమహిమ మనకు గోచరమగును. దానినుండి మనము రెండువిషయము లూహింపనగును.

[1] సర్వవ్యాపకమైనట్టియు, సర్వసామాన్యమయినట్టియు నొక తత్త్వ

మున్నదనియు [ Divine Essence ].

[2] ఆతత్త్వమనేక రూపములుంగొని మానవుల తలంపులలో నొక్కొక్కవిధముగ వ్యాపించినదనియు. [ఆత్మతత్త్వము]

పై రెండువిషయములు మనమీప్రపంచమునుజూచినచో స్పష్టముగ నగపడుచుండును. నాస్తికులయందును చార్వాకులయందును నైతమీతత్త్వ మొక్కొకతూరి పాటాత్తుగ వెలిపడుచుండును. మతములేనిజనులు ప్రపంచములోనే లేరనియు నటులెవరైనను ఉండినచో వారు కేవల పశుప్రాయులగు నడవిజనులగుదురనియు, చరిత్రలేమి పథికులగాధలేమి తెలుపుచున్నవి. మానవులకుఁ దెలిసినంత మట్టుకు నెచ్చోటనైనెక్కాలమునఁగాని మతములేనిజాతి యుండినటులగపడదు. ప్రారంభమున నాచేతఁ జెప్పఁబడినరీతిగ మతతత్త్వమనేకాకృతులు గొనిజనులలో వ్యాపించి స్థలవిశేషముల కొలదివన్నెలుఁ గాల్చి మనుజుల చిత్తచాంచల్యము కొలఁదిని భూమికలుధరించి ప్రపంచనాటకశాలలందు నటించుచుండును. తత్త్వమొకటియైనను రూపభేదములనేకములయి యగపడు కారణంబున ప్రకృతిసాంబంధిక మాయజనుల జ్ఞానమునుఁగప్పి తత్త్వమును మఱుఁగుఁబఱచి వెలిరూపములే నిజములని భ్రమఁజెందులాగొనర్చినది. తెలివిగలమనుజుఁడు పెట్టుచాయను దొలఁచి పుట్టుచాయను గుర్తెఱిఁగనేని సర్వవ్యాపకమగు మతతత్త్వమును దెలిసినవాఁడగును. దాని దెలియక జనులనేకులు పైచాయలే దైవనిర్మితములగు మతములనినమ్మి దానినిసాధింపఁ గ్రూరకృత్యంబులనేకములొనర్చుచుఁ బలువిధములగు ననర్థములకుఁ గారణభూతులైరి. మతవిషయమున సత్యమగుతత్త్వమొకటి నిజముగనున్నదియా? కాదేని మానవమానసగోచరమయిన యెద్దియో యొక విషయము దైవసాంబంధికమని తలంచి యావిషయనిజస్థితినిఁ దెలియ సార్వకాలమాలోచించుచు నిరర్థకులయి పిదప నావిషయమునుగుఱించి యనేకప్రశ్నలు వేయుచు నిరుత్తరులయి దేవులాడుచున్నవారాయనునది విచారణీయముగ నున్నది. ఈవిచారను సర్వేక్షప్రజ్ఞగల పెద్దలుసేయఁదగినది కావున నేనిచట దానిజోలికిఁబోవ నిష్టపడను. అయినను నీవిషయమున నొక చిన్నికథనాజ్ఞప్తికివచ్చినది. ఏబ్రహాంబాల్యమున నొకదినమునఁ బ్రాతఃకాలమునుండి సాయంత్రివరకును సూర్యప్రకాశమును జూచి సూర్యుఁడే దైవమని నమ్మెనఁట. సూర్యుఁడస్తమించి చంద్రోదయమయి చల్లనివెన్నెల ప్రపంచమెల్ల వ్యాపించినదిచూచి చంద్రుఁడే దైవమని తలఁచెనఁట. కొంతకాలమునకుఁ జంద్రుఁడుమునింగి యంధకారంబు దశదిశల

వ్యాపించెనఁట. అప్పుడా బాలుఁడు తానుప్రారంభమునందలఁచినవారు దైవములు కారనియు వీరినిమించిన దైవమొకఁడుండవలెననియుఁ దలంచి వానిఁ దెలియుటకు యత్నింపసాగెనఁట. అటులనే కొన్ని సమయములు జూచి కారణములు లూహించునట్టిదియే యీమతవిషయము! కావున నిజముగ మతతత్త్వమొకటియున్నదియా యనునది స్థిరము విచారణీయము. ఒక్కస్థలమునందుఁగాని యొక్కజాతియందుఁగాని యొక మనుజునందుఁగాని నెలకొనక, సర్వప్రపంచమందును, సర్వజాతులందును సర్వజనులందును, నీమతతత్త్వము వ్యాపించియుండు కారణంబున నిదినిజమగు తత్త్వమని నమ్మవలెను. అటునమ్మ ముందువిషయ మాలోచింతము. కాదని యెవ రైనను స్థాపింపుడు మొదల వదలుదము.

మానవునియంతర తలంపులబలెనే, మతవిషయక మగుతలంపు నైతము వానిబాహ్యాచర్యల వలనమన మెఱుంగనగును. బాహ్యాచర్యలను బట్టితప్ప మానస చర్యలు మనము తెలియఁజాలము. బాహ్యాచర్యలు పలువిధములుగ నుండినను సామాన్యతత్త్వ మొకటియుండ దానివలన నీభిన్నాకృతులు పుట్టినవని చక్కని విమర్శనము వలన మనము తెలియనగును. ఆసామాన్యతత్త్వ మెద్దియన, మానవుఁడు తనకు దైవబాంధవ్యమున్నదని నమ్మియా దైవముతో హెచ్చుసంబంధముఁ గలిగించుకొనునపేక్ష. ఇట్టియపేక్ష మనుజునకు లేనిచో మతమను తలంపే మానవునకుండదు. ఉండినను వెలికిరాదు. ఈతలంపు ప్రతిమనుజుని మానసమునందు నైజముగనుత్పన్నమగుచుండును. ప్రపంచంబునుజూచియు, నందుండు పర్వతములు సముద్రములు, నదులు, అరణ్యము చెట్లు, సూర్యచంద్రనక్షత్రములు, వాయురాకపోకలు, ఋతుసాంబంధికవర్షములు మొదలగు ప్రకృతి చిత్రములనుజూచి వానిని గలిగించు వాఁడొకఁడుండునని యెవని హృదయమునందు గోచరింపకయుండును? అట్టిమహాశయుని నారాధించుటవలనను, వేఁడుటవల్లను, తలఁచుటవల్లను, కీర్తనలు పాడుటవల్లను, వానితో సంబంధము గలుపుకొను నపేక్షయే మతము. ఇట్టియపేక్ష మనుజునకుఁగలిగినతోడనె దానిని సాధింపఁదగిన మధ్యవర్తులు, గావలసివచ్చునుగదా! తమప్రార్థనలు దైవములకుఁ జేర్చి, దైవముల యాజ్ఞలుగొని తెచ్చుటకు మనుజులు తమలో పెద్దలున్ జ్ఞానులును నగువారిని మధ్యవర్తులుగ నేర్పఱచుకొనుట సహజము గదా? మనుజులనడవడికల గుఱించి పలుకుచు వారిదుష్కృత్యములకుశిక్షయు, సుకృతములకుఫలమును నిచ్చినట్టులపలికిన మధ్యవర్తులవచనములను సంపూర్ణముగ నమ్ముట పురాతనమానవులకు సహజముగనుండెను. ఆదైవమును సమీపించుమార్గములు దెలుపుగాథలు పవిత్రకరములని కొల్లకాలము పఠింపసాగిరి. దైవము జనుల

దేవతాదికలను గురించి వ్రాసినాడనుకట్టియు దైవసమ్మతిని స్థానముల వ్రాసిరనుకట్టియు దైవమోక్షమునకుచే వ్రాయించెననుకట్టియు గ్రంథములు దైవముంబలెc బూజ్యములైనవి. అందులోని ప్రతి యొక్క శబ్దమును జనులు శిరసావహింపవలెననియును, [illegible] చేయవలెననియును నందులకు విరుద్ధముగ నెవరు [illegible] నలుప [illegible]ను నిర్ధరింపబడెను.

మానవులకు దైవములతో సంబంధము గలిపికొనవలెనని సంపూర్ణముగ నపేక్షగలిగియుండిన కారణంబున దమ ప్రార్థనలు దైవముల సరసకుc గొనిపోవుటకును దైవముల యాజ్ఞలు మనుజులకుc దెల్పుటకును సాధనములుగ [illegible] యేర్పడెను. విదప దైవానుగ్రహమును సంపాదింప [illegible] మార్గములు వెదకికొనిరి. అందునc గొన్ని యిచట వ్రాసి విదప [illegible] మార్గములందు [illegible] తెలిపెద.

మానవులకును దైవములకును సంబంధము గలుగు మార్గములు రెండు భూలోకమునుండి స్వర్గమునకు, జనుల ప్రార్థనలు గొనిపోవు మార్గము మొదటిది. స్వర్గమునుండి దైవముల యాజ్ఞలు జనులకు దెలుపు మార్గము రెండవది. ప్రారంభమున నీ రెండు మార్గము లెన్ని విధములుండునదియు యేయే మతస్థు లేమార్గము నెటు లవలంబించినారనియు నీక్రింద వివరించెదను.

[1] దైవమునుగురించి కొన్నికొన్ని వ్యక్తకాలములం దుత్సవాదులొనర్చుట. ఇవి "పవిత్రకాలము" లని నే బేరిడెద. ప్రార్థనలు, స్తుతులు, బలులు, ఉత్సవములు, ఆగమములు, ఆరాధనలీ తరగతిలోc జేరును.

[2] ఒకటవ తరగతికిc జేరిన యాగమారాధనాది కర్మములొనర్ప స్థలవిశేషంబులు నిర్ధరించుట. వీనికిc "పవిత్రస్థలములని." పేరిడెద.

[3] మతకార్యములకుగాను వస్తువు లనేకము లియ్యcబడును. పటములు, విగ్రహములు, వస్త్రములు, ఆభరణములు, ఆరాధనలకుcగా నియ్యcబడిన భూములు, పాత్రలు. ఇవి యీ తరగతిక్రింద వచ్చును. వీనిని "పవిత్రవస్తువులని" పేరిడెద.

[4] కొందఱు దైవములతో సామీప్యసంబంధము గలిగించికొనవలెననెడి నత్యాశతో నాహార విహారములువదలి సార్వకాలము దైవస్మరణలో నుందురు. సన్న్యాసులు యతులు మొదలగువారు. "పవిత్రమానవులని" వీరికిc బేరిడెద.

[5] కొందఱు జనులు స్వప్రయోజనమునకుcగాక లోకహితార్థంబునకునై లోక

మునకే దైవసంబంధము గలిగింపవలెనని యుద్యమించువారు. ఇట్టివారిని మహాత్ము లని పేరిడెద.

ఇంక దైవముల యాజ్ఞలు భూజనులకుఁ దెచ్చు మార్గములు గొన్ని యున్నవి. వానినీక్రింద నుదాహరించి పిదప నేయేమతములందీ యాచారములు సామాన్యముగ నున్నవియను విషయము సూక్ష్మముగఁ జర్చించెద.

[ఏ] దైవములు తమయాజ్ఞలను కార్యముఖమునఁ దెలియఁజేయుచుండును. అవి శకునములు. ఆవేశవచనములు "మహిమలు" కలలు ఇత్యాది కార్యములద్వారా తెలియపఱతురు కావున నివి "పవిత్రవార్తలని" పిలువఁబడును.

[బి] కొన్నిస్థళములు దైవచోదిత వచనములు వినుటకునై యేర్పడినవి. వానికిఁ "బవిత్రస్థళము"లని పేరిడెద.

[సి] దైవమహిమలు గలిగినవిగఁ గొన్ని మూలికలును వస్తువులు నేర్పడినవి. రోగనివారకములుగను భూతోచ్చాటనలకును వానినుపయోగింతురు. ఆరాధించు చుందురు. వీనికిఁ "పవిత్రమూలికలని" పేరిడెద.

[డి] సమస్తజాతివారును దైవముల యాజ్ఞలను తమకుఁదెలుపుటకును నా యాజ్ఞలెట్లు లోనరింపఁదగినదియుఁ దెలుపుటకును జ్ఞానులగువారినిఁ గొందఱిని నేర్పఱచికొందురు. అట్టివారికిఁ "బురోహితులని" పేరిడెద.

[ఇ] కొందఱు తాము దైవములకుఁ బ్రియులనియు దైవములు తాము తలఁచి నపుడు తమయందావేశించి, కాఁదగిన కార్యములకు మార్గములు చూపుచుందు రనియుఁ దెలుపుచుఁ బూజ్యులయినారు. వీరు "దైవముచెప్పువారని" పిలువఁ బడుదురు. [Prophets]

[యఫ్] మతాచారములు చక్కఁగ జనులు నెరవేర్చుటఁ గనుటకునై దైవము తమకు నధికారమిచ్చినాఁడనువారు కొందఱేర్పడినారు. వీరికి "స్వాము" లని పేరిడెద.

[జి] మనుజులు జాబులు వ్రాసి దైవములకుఁ జేర్ప నశక్తులైనను దైవములు జనుల విషయమునఁ గొన్నినిబంధన లొనరించి వానిని వ్రాసి భూలోకజనులకు నిచ్చినవని గొన్నిగ్రంథము లేర్పడినవి. వీనికిఁ "బవిత్రగ్రంథము"లని పేరిడెద.

సభ్యులారా! మతప్రవాహములోఁ గొన్ని శాఖలివి. వీని నొక్కొకటిగ విడదీసి యావిషయము వెవ్వేఱుగ వ్రాయఁబూనెద. విపరముగ వ్రాయుదునేని గ్రంథబాహుళ్యమగును. కావున నేను స్థాలీపులాకన్యాయముగ వ్రాసినది చదు వరులు విస్తరించుకొందురని నమ్మినాను.

హృదయాంతర్గతమగు మతతత్త్వమును వెలివేయు బాహ్యచర్యల క్రమము.

(1). పవిత్ర కార్యములు.

మానవప్రారంభ బాహ్యచర్య సామాన్యముగఁబూజావిధానమున వెలివడుచున్నది. దైవమునుస్తుతింప వలెనను తలంపుమానవుని మానసమునందు హఠాత్తుగఁదనంత కుఁదానేపుట్టును. స్తుతులరూపము స్తుతివిధానము, స్తుతించు స్థలము, పలురీతులుగ నుండును. ప్రథమమున మానవుఁడు తనశక్తికంటెను భిన్నమయినట్టియు యత్యధికమయినట్టియు మఱియొక శక్తికలదని భావించెను. అటుభావించినపిదప నట్టియమానుషమైనదైవశక్తిని స్తుతులచేతను పూజావిధానములచేతను సమీపింపవచ్చునని నమ్మెను. అటునమ్మితానొనరించు స్తుత్యాదులు రిత్తపోవనియు దానికి దైవము ప్రతిఫలమిచ్చుననియు నిర్ధరించెను. అతిపురాతనకాలమునందున్న మానవుఁడు, మర్త్యునకు దృగ్గోచరముగాని యొకశక్తికిఁదనయునికిలోఁబడినదనియు, యాశక్తి చర్యసంపూర్ణముగఁదానుగనఁజాలడనియుతలఁచెను. ఆదైవశక్తిక్రమము, మానవులు తమతమ యోగ్యతానుసార మూహింపసాగిరి. ఏవిధమయినబుద్ధియు లేనట్టిమోటుజనులు తమయెదుటనగపడు ఱాళ్లు అప్పలు, శల్యములు, తోళ్లు, వెంట్రుకలు వీనియందుదైవమహిమయున్నదనియూహించి వానినారాధించుచుండిరి. ఇంచుకతెలివిగలవారు ప్రకృతిచిత్రమహిమలకునబ్బురమంది, గొప్పపర్వతములును, నదులును, వృక్షములును, దైవమహిములుగ భావించిపూజించిరి. అంతకంటెను హెచ్చుగబుద్ధిగలవారు తమకంటికిఁగనపడినను, బట్టనలవిగానట్టియు, స్వర్శనీయములుగానట్టియు వస్తువులేదైవశక్తులని గౌరవించి యారాధింపసాగిరి. సూర్యచంద్రాది గ్రహములు, నక్షత్రములు, మరుత్తులు, మేఘములుమొదలగునవి యీతరగతిక్రిందవచ్చి, పూజింపఁబడసాగెను. పైనపలుకఁబడిన దైవమహిమలు కొంతకాలమునకు మహాచ్ఛక్తిగల మనుజులుగ భావింపఁబడి పూజ్యతనందెను. మఱియును గొంతకాలమునకుఁ బైశక్తులకంటెను మించినదైవశక్తి యదృశ్యముగనెచటనో యుండుననియు, పైనవివరించిన శక్తులాశక్తియొక్క యాజ్ఞలు నిర్వహించు వారనియు జ్ఞానులు కొంద ఱూహింపసాగిరి. ఈరీతిగమానవులచే నూహింపఁబడినశక్తులు మానవమానసములందవిచ్ఛిన్నముగ జంటింపఁబడిమతరాజ్యము నేలుచుండును. ఇదేవిధమున నే పితృదేవతలపూజలు సైతము మానవుల యూహాజనిత ఫలములు, మంచిశక్తులబలెనేచెడ్డశక్తులు సైతము పూజ్యతఁగాం

చెను. భక్తిచేఁ బ్రారంభశక్తులు పూజింపఁబడుచున్నవి. భయముచేఁ జెడుశక్తులు లారాధింపఁబడుచున్నవి.

పురాతనకాలమునుండియు నారాధనలుసలుపుటయు వానివిధానములను జక్కఁగ గమనించినచోఁ బ్రాచీనజనులు తమయారాధనలు దైవసమ్మతములనియు దైవములాయారాధనలను స్వీకరింతురనియు సంపూర్ణముగనమ్మిరని తెలియనగును. ఆరీతిగ దైవములుతమస్తుతులు వినితమకు మేలొనరింపవనితలఁచి యుండినచో నిట్టియారాధనలేజగత్తునఁ బుట్టియుండవు. అట్టిస్తుతులలోని శబ్దములు, వానియన్నికలు, వానియుచ్చారణ క్రమములు, స్థలములు దైవముల మానసామోదములుగ నుండవలెననియు, వీనులకు విందులుగనుండవలెననియు వాపరాదగినవి యస్థానములుగనుండవలెననియు పురాతనమానవుల యభిప్రాయము. వైరీతిగస్తుతుల చేనారాధించునపుడా స్తుతులలోఁ దమవినయవిధేయతను జూపునట్టివాక్యజాలమును, దైవములయున్నతియును, మహాశక్తియును జాటుస్తోత్రపాఠములు నుండఁ దగునని వారిసంపూర్ణాపేక్ష. ఈపాఠములు, స్తుతులుప్రార్థనలని రెండువిధములుగఁ బరిణమించెను. స్తుతులన దైవములయొక్కయున్నత స్థితియును, మహత్శక్తియుఁ దెలుపునవి. ప్రార్థనలనంస్తుతులొనరించుచుఁదమకుఁ గావలసినయర్థంబులిమ్మని దైవమును గోరునవి. స్తుతులన్నియును బ్రార్థనలుగఁబరిణమించెను కావునయారెంటికిని భేదమగపడకపోయెను. కేవలస్తుతులరూపకముగఁ గొన్నిపూర్వవాక్కులున్నవి. అవియత్యల్పము. అనేకమతమువారు పూర్వకాలంబున నుపయోగించిన ప్రార్థనలలోఁ గొన్నియిచటవ్రాసెద.

యుద్ధసమయమున నూట్కాయనుజాతివారీరీతిఁ బ్రార్థించెదరఁట.

“ దైవమా! నన్నుమననిమ్ము. అశక్తునిఁజేయకుము. నా శాత్రవులను నాకుఁజూపుము. వారికివెఱవనటులఁ జేయుము. నేఁగాంచినపుడు వారునిద్రింపనిమ్ము. వారిననేకులను నేఁజంపనిమ్ము”.

హురాన్‌జాతివారు వ్యాపారమునకుఁ బోవునపుడీరీతిఁబ్రార్థింతురఁట.

“ ఈ స్థలమునందుండు “ ఓకి ” దైవమా! నీకుఁదగినంత పొగాకు నిచ్చెదను. మాకుఁదోడ్పడుము. నావలనుండిమముఁగాపాడుము. శాత్రవులనుండి మమురక్షింపుము. మంచివ్యాపారము దొరకనిమ్ము. భద్రముగమేము తిరిగిమా గ్రామముఁజేరనిమ్ము. కాఫర్లుతమదైవముల నీరీతిగఁబ్రార్థించెదరు.

“ దైవములారా! నన్నురక్షింపుడి. నాపిల్లలనురక్షింపుడి, నాభార్యలను రక్షింపుడి. నాజనులనురక్షింపుడి. నాపిల్లరోగమునివారించి రక్షింపుము. బిడ్డలననేకులనిమ్ము

పుత్రసంపద చాలుగ నుండనిమ్ము. పుత్రికాసంపద స్వల్పముగనుండనిమ్ము. ఆహార సంపదనిమ్ము. పశుసంపదనిమ్ము.

సామన్ జాతివారు సాయంకాలపు హోమాయను వసనము (ప్రార్థన) తమ దైవమును గురించి యీరీతిఁ బలుకుచున్నారు.

"దైవములారా! మీరునై "ఆవా" యనురసమును సిద్ధపఱచినారు. అనుగ్రహించి మాకుటుంబమును జూడుము. ఈకుటుంబమునకు సౌభాగ్యమిచ్చి వృద్ధిఁ బొందింపుము. మాకునారోగ్యమునిమ్ము. మా వృక్షములు ఫలములొసంగ నిమ్ము. నీజనులకుమాకునాహారమునిమ్ము. ఇదిగో ఆవానుగొమ్ము."

పురాతనార్యులు విశేషనాగరికతఁ గలవారయినను వారివేదఋక్కులందు సైతము సైమోటుజనులబలెనే ప్రార్థనలున్నవి. M. 1. 64 లో "మరుత్తులారా! మాకుబలమిండు. యశమిండు. యుద్ధములో జయమిండు ధనమిండు etc. అనియున్నవి.

జబ్ పుస్తకములో సైతమిదేరీతిగఁ బ్రార్థనలు గొన్నియున్నవి. హీబ్రూల ప్రార్థనల క్రమముఁజూప సాలోమన్ ప్రార్థననీక్రింద వ్రాసినాను.

"యెహోవా! క్షామమునివారింపుము. ఈతిబాధలనుండి సంరక్షింపుము మంచివర్షమునిమ్ము etc."

లిటర్జీలని పిలువంబడు క్రిస్టియన్ల ప్రార్థనలు సైతమిదేవిధముగానున్నవి.

వర్షమును గోరుచుఁ బ్రార్థించు ప్రార్థనలు ప్రపంచమున సర్వమతములందున్నవి. భూలోకమునఁ బాపము హెచ్చయినపుడు వానలు కురియవనుతలం పెల్లప్రపంచము వ్యాపించెననితోఁచెడు. కావున వర్షమును గురించిన ప్రార్థనలేమతమునందునను హెచ్చినవి. (ఇప్పటికాలమువారు సైతమీతలంపు వదలకయున్నవారు. వానలులేక క్షామము బలమయినపుడు ప్రార్థనలు నభిషేకములు బలమగుచున్నవి. ఈ విషయమున మతమనుపాశము మానసమును బంధించినది. యుద్ధమునందు జయమును గోరుచు పురాతనజనులు ప్రార్థించిరనవేల యిక్కాలమున్న సైతము నాగరికతలో నసమానులనిప్రసిద్ధిఁగాంచిన యాంగ్లేయులు సైతము తమదేవాలయములలోనీ విషయమునుగురించి ప్రార్థించుచుందురు.

కొన్ని మతముల ప్రార్థనలలో నిచ్చిపుచ్చుకొను వ్యాపారసంబంధములు కొన్నియున్నవి. పూజించువాఁడు దైవమునకుఁగాను పనిచేసిన కారణంబునఁ బ్రతిఫలమిమ్మని కోరుచుండును. అటులియ్యనిచోఁ దనపనిని వదలుకొని [illegible]

కును. స్తుతిపాదములకు బహుమానము ప్రతిఫలమొసంగుట. ఋగ్వేదమున మహత్తులను బొగడుచు నార్యులు తమకుఁ బుత్రసంపదనిమ్మనియును నాహారమిమ్మనియును, జలవసతిఁగల స్థలము తమకుఁ జూపుమనియు వేఁడినారు. హీబ్రూలున్ను క్రిష్టియనులు నిదేరీతిగఁ దమదైవములను హెచ్చుగఁబొగడి ప్రార్థించినారు. ముఖస్తుతి హెచ్చుగ నొనర్చినయెడల తమదైవములు తమ్మనుగ్రహింతురని సర్వమతములవారును నమ్మినారు. హెచ్చునాగరికతఁగలగ్రీకుమతస్థులలోనత్యతిశయ పండితుఁడనిసుప్రసిద్ధికెక్కిన "యస్కైలాస్" యనుకవి. "Theswam against Thebes" యనునాటకములో "జీయస్స్" యను దైవమును బ్రార్థించుచు నీరీతిగఁ బలికినాడు. "దైవములారా! మనయుభయుల మేలుకుఁగాను" "టీబిస్సు" పట్టణమును గాపాడుము. పట్టణము వృద్ధిఁజెందెనేని దైవములకు గౌరవము కలుగును. ఇట్టి పట్టణము పోయెనేని దైవములారా! మీరు నివసింప మఱియొకపట్టణ మిట్టిది మీకునెచట దొరకును?" అని ప్రార్థించెను. జేకబ్బు జిహోవానుగుఱించి యీరీతిగఁ బలికెను. "దైవమా! నాసరసనుండి నామార్గముకంటక రహితముగనొనర్చి తినసన్నమును గట్టనుబట్టలునిచ్చి మరల నేను నాగృహమును జేరితినేని నపుడు గదా నీవు నా దైవమగుదువు. నాచే స్థాపింపఁబడిన యీశిల దేవాలయమగును. నీవు నాకునిడినదానిలోఁ బదియవభాగము మరలనీకిడుదును" జిహోవా దైవమగుట జేకబ్బు కోరిక నెరవేలుట. అటుకాదేని జిహోవా దైవముకాడని యర్థమగును. వేదబుక్కులో నార్యులప్రార్థన యొక చమత్కారముగఁ బలుకఁబడినది. "పృస్నిపుత్రులారా! మీరుమర్త్యులయి నేనమర్త్యుఁడనై యుంటినేని నన్నారాధించువారు వ్యర్థులగుచుండలేదు. ప్రాణములుఁ దోఁగుచుండలేదు. మఱియొక బుక్కులో నీవిధముగఁ బలుకఁబడినది "ఓ, యింద్రా! నేనింద్రుఁడయి యుంటినేని ధన్ముసుతించువాఁడు పశువులు లేనివాఁడుగ నుంటుండలేదు."

సర్వమతములందును నిట్టిప్రార్థనలున్నవి. కావున దీనినుండి మన మూహింపఁదగినదియే మన బహు పురాతనకాలమున మానవుఁడు తనకు దృగ్గోచరముగాని మహాచ్ఛక్తి యొకటియున్నదని సంపూర్ణముగనమ్మి భూలోకమున మహారాజులనాశ్రయించి పొగడుచుండినచోఁ దమకు ఫలప్రాప్తి యెటులగునో యావిధముగనే తాము మానసమునందెన్నిన మహత్సక్తియును దమపొగడికవిని తమకోరికలు నెరవేర్చునని నిస్సందేహముగను నిష్కల్మష హృదయమున నమ్మినవారు. అదేయభిప్రాయమే తరతరములుగ వచ్చుచు వారివారి బుద్ధివిశేషముల కొలదిని బెలుగుచు విఱుగుచు మరల మొలకవేయుచు శాశ్వతముగనిలిచినది, ఆ మానవుల

పొగడికలువిని ఫలములిచ్చు శక్తియొకటి యదృశ్యముగ నున్నదియను గొప్పవిషయము పెద్దలు నిర్ధరింపఁదగినది. ఆజోలి నాకేల? ప్రపంచమునందుండు జాతులలోనెల్ల నీస్తుతు లనేకరూపములుగొనియుండు కారణంబు మతతత్త్వరూపములలో స్తుతిరూపకమైనది ముఖ్యమని వ్రాసితిని.

మతమును వెలివేయు రెండవ బాహ్యాచర్య.

బ లి స మ ర్ప ణ ము.

స్తుతులకుఁగలిగిన పురాతన ప్రాముఖ్యము బలిసమర్పణములకు లేకయున్నను నిది ప్రాచీనమానవుఁడతి ప్రాచీనకాలముననే ప్రపంచమునం దుద్భవింపఁజేసినది. స్తుతులున్న మతములలోనెల్ల బలులున్నవి. ఈ రెంటికిని భేదమేమనిన స్తుతు లొకానొక సమయమున మానవుని మానసమందు హటాత్తుగ నుద్భవించి వెలిపడునవి. బలులన్ననో, దీర్ఘాలోచనపైన బల్యర్పణవిధులును బల్యర్హమగువస్తువులును నేర్పఱుపఁబడిన విషయములు గలిగినవి కావున బల్యర్పణవిధియొక యధికారబలమునకు లోఁబడినది. కావుననే కొన్ని బల్యర్పణ విధులందుఁ బురోహితుల సాన్నిధ్య మవశ్యకమయ్యెను. బల్యర్పణవిధులు పుట్టుటకుఁ గారణము లీక్రింద వివరించినరీతిగ నూహింపనగును. తాఁదలఁచిన దైవములకుఁ దగిన బహుమానములిచ్చినచో దైవము తన్ననుగ్రహించి సౌభాగ్యసంపద లొసంగుననెడి యపేక్ష స్తుతులు నోటిమాటలు. దైవమునందు సేవకునకుఁగల యత్యంతాసక్తినిఁ గార్యమూలకముగఁ దెలుపవు. ఐహిక సంపదనంతయును యజమానుఁడు స్వప్రయోజనమునకుమాత్ర ముంచుకొనినయెడల, వానిపైన దైవములకు నాగ్రహముగలిగి చెడుగొనరింతురేమోయను భీతిప్రాచీన మనుజునకుఁ గలిగియుండును. ఇదియును గాక దైవములు తన్ననుగ్రహించి సకలసౌభాగ్యము లిచ్చినందులకుఁ గృతజ్ఞుఁడయి మానవుఁడు వారి సంతోషమునకయి కొంతభాగము బలులరూపముగ నర్పింపవలెననెడి యుత్సాహంబుద్ధివలననైనఁ గలిగియుండును. యజమానుని భక్తియు, నాచారశీలతయు, రాఁబోవు లాభమనెడి యాశయును, బలిభాగరులగు పురోహితులచేఁ బెంపఁబడెను. అదృష్టవశమున యజమానునకు ధనధాన్య సంపదలు హెచ్చెనేని దైవములకు బల్యర్పణ ఫలమదియని యెన్నిరి. ఎద్దియయినను జెడుగుమూడెనేని బల్యర్పణములు సేయమియో, చేయుటలో లోపమోయని యెన్నిరిగాని దైవములు వీనిని స్వీకరించు నభిలాష కలవారగునో కాదోయను నంశమును విచారింపఁబూనరైరి. ఈ రీతిగ నీ బల్యర్పణ విధానము వృద్ధినందెను. ఒకరిని

మొదట యొకరు వారికిందరు హెచ్చుగానైనను ముత్సరబుద్ధిచే నీ యాగవిధులును నాగమబలులును నాగరికాలము నాగరికతలును హెచ్చుఁజేసిరి. ప్రారంభమున మనుజుని సంతోషపెట్టుటకు యొసంగబడుచుండిన బల్యర్పణములు కొంతకాలమునకు వదలఁబడని విధులయ్యెను. అది యొక బలవద్బాధకమగు శాస్త్రమయ్యెను. జనుల సంతోషముకొఱకు రాజులకుఁ బ్రారంభము నిడుచుండిన బహుమానములు కొంతకాలమునకు నిర్బంధించబడిన పన్నులయినట్టుల నీ బల్యర్పణములు విధులయి పరిణమించెను బల్యర్పితవస్తువు లనేకరూపములు గొనినవి. మనుజు లేవస్తువుల నమూల్యములని తలఁచుచుండిరో యవి బల్యర్హములగు పదార్థములయ్యెను. భక్ష్య భోజ్యములు, పానకము, పిండివంటలు, పాలు, పెరుఁగు, నెయ్యి, యీ మొదలు లయిన వస్తువులు బలులకుఁ బ్రియములయ్యెను ఆదివిజనులు కొందఱు తమకనుపయోగకరములుగాని వస్తువులు శక్తులకు బలులిచ్చుచుండిరి. అవి శక్తులకుఁ బ్రియములుకావయ్యెను గావున వారభీష్టసిద్ధిఁ జెందలేదను గాధలు వాడుకలోవచ్చెను. వెలలేని బల్యర్పణమునునది మానవబలి. ఈ మానవబలి నాగరికతలేని మూఢజనులందుద్భవించెను. పిదపఁ బ్రపంచమునఁ బలుచోట్ల వ్యాపించెను. దక్షిణసముద్ర ద్వీపములందు మానవబలులతి ఘోరముగనుండెను. నీగ్రోలయందునైతమిది హెచ్చుగనుండెను. మెక్సికనులు నాగరికతఁగల వారుగనుండినను మానవబలులిచ్చు చుండిరి. అయితే వారు తాము జయించి పట్టితెచ్చిన శత్రువులను బలియిచ్చు చుండిరి. ఉత్సవముల కాలమున బలినివ్వఁదగిన మనుజుని నొక సంవత్సరము దైవముగఁబూజించుచు, సకలాహారము లిచ్చి సకలభోగములఁ బెంచి, యుత్సవదినంబున శక్తికిబలి యిచ్చుచుండిరి. ఇటులనే బహుదేశములందును బహుమతములందు నీమానవబలులు హెచ్చియుండెను. ఇప్పటికిఁ గొన్ని స్థళములందు మూఢజనులీమానవ బలులనిచ్చు చున్నారు. అయితే యిది యతిరహస్య ముగజరుగును. ఈమానవబల్యర్పణముతోనే పశుబలులు రూఢిలోవచ్చెను. వెలలేనివస్తువు మనుజునిప్రాణము. దానికి రెండవది పశుప్రాణము కాఫర్సుబలులెప్పుడును పశువులు మేకలు, మందలోవెలగల గొప్పయెద్దును బలికిగాను నిర్ధరించియుంచుచుండిరి. దానికిశక్తిపశువని పేరు. ఆఫ్రికాలోఁబశ్చిమ తీరమందుండు “ సూసూస్స ” ను మతమువారు తామేముఖ్యమగుకార్యమును సేయఁదలపెట్టినను వృషభబలియివ్వకఁ జేయుచుండ లేదు. వ్యవసాయకాలమునందు గొఱ్ఱెనైనను మేకనైనను బలియివ్వకవారు భూమిని దున్నుచుండలేదు. క్రిబియన్

ద్వీపములవారు, "ఎద్దు, ఆవు, గొఱ్ఱె, మేక, కోడి, సారాయి, పండ్లు" యీవస్తు వులలో నెవ్వియయినను బలులివ్వక యే కార్యము నెరవేర్చుచుండలేదు. అమెరికాలో నుండునిండియనులు పొగాకు, జొన్నలు etc. బలులిచ్చుటయగాక మంచికుక్కలను బలులిచ్చుచుండిరి. ఆయిండియనులకుఁ గుక్కలన్నఁ బ్రీతిమెండు కావుననే కుక్కలను బలులిచ్చుచుండిరి. చైనావారు ఎద్దులు, దూడలు, గొఱ్ఱెలు, పందులు మొదలగు వానికొంతకాలమువరకుఁ గడిగి పావనమొనర్చిపిదప బలులిచ్చుచుండిరి. జ్యూ జాతివారు పందులఁదప్ప మిగతమాంసములు బలులుగనిచ్చుచుండిరి. మిగతపశువులే రోగములేకనారోగ్యస్థితిలోనుండి బలిసియుండవలెనని వారిచట్టము. అనేకదేశస్థు లన్నము బలిగనిచ్చుచుందురు. పండ్లలో మొదటిపంట దైవములకుగాను వదలుచుం దురు. కొన్నిదేశస్థులు తాముహారముగఁగొను పదార్థములలో గొంతభాగము దైవమునకు బలిగఁదీసిపెట్టుదురు. తమపానములోఁ గొంతభాగముదైవమునకు బలి యనిక్రిందఁజల్లుచుందురు. ఒక్కొకదేశము వారొక్కొకవిధముగ బలులిచ్చుచుం దురు. పార్శీవారు రొట్టెయు హోమరసమును బలులుగనిత్తురు. బలులిచ్చువారు దైవయోగ్యములవియని యెవ్వితాముదలంతురో యవియెంతవెలగలవస్తువులైనను వెనుదీయక దైవములకు నిడవలెనని యుద్దేశ్యము. జ్యూలో కానొకసమయమున జహోవాకు మంచియెద్దునివ్వక బక్కపలచని యావునిచ్చుచుండగ దైవమునకుఁ గోపము వచ్చిదానిని నిరాకరించినవానింబలెనటించెనఁట. చెడినయాహారమునుగాని పానీయమునుగాని బలులుగనివ్వఁగూడదని బౌద్ధులుపలికిరి. సర్వమతస్థులిదేరీతిగఁ బలుకుచున్నవారు. రాజాధిరాజులకు నెట్టియమూల్య పదార్థములు బహుమానము లుగనివ్వఁబడునో యంతకంటెను హెచ్చుగునవిదైవములకు బలులుగ నివ్వవలెననిజ లను యభిప్రాయము. అట్టివియే దైవముల కోరికగనుండవలెనని వారెన్నియుండిరి. దైవమహిమ యందుఁగల నమ్మకమునకుఁ జేరికగమతమునందలి హెచ్చుపట్టుదల యును సమానులలో నుత్తమశ్లోకుఁడుగావలెనను నభిలాషయునుఁగూడి ప్రేరేపిం పఁగొందఱు తమసర్వస్వముదైవప్రీతిగబలులిచ్చి సన్న్యాసులైరి. ఇట్టిసమర్పణము లలోఁ బురోహితులు భూరిభాగరులుగనుండుదురు కావునను, పురోహితులుమోక్ష మార్గదర్శకులని జనులుసంపూర్ణముగ నమ్మియుండిరి. కావుననే బల్యర్పణములు దిన దినాభివృద్ధిఁగాంచెను. బలిసమర్పణమనునది కొన్నిసమయములలో "దేవునకుఁజూపు లుమాపుమేపు" లనునిదర్శనమునకుఁ గుఱుతిగనుండును. సమస్తమతములందును బలిగ నివ్వఁబడిన పశ్వాద్యాహారములు పురోహితులకును మానవులకు నాహారముగ నుండును "Christian Sacrament" యిట్టిదియ. ఆర్యులయొక్కయు నైరాకీల

యొక్కయు బలులీ సంబంధములేను. ఆర్యులనైనఁగిన దేవనైవేద్యమిట్టిదియు. మెక్సికనులు పిండియును దేనెయును గలిపి నైవమునుజేసి పూజించి దానినెల్లరు భుజించుచుందురు. పార్శీలలోనేమి జ్యూజాతివారియందేమి యార్యులయందేమి మఱికొన్ని మతస్థుల యందేమి శక్తి బలులుగ నర్పింపఁబడిన వస్తువులలోఁ గొన్ని భాగములు పురోహితులవని విధులేర్పడినవి. ఆ భాగములు మఱియెవ్వరు నంటఁగూడదని విధి. ఐహికపారలౌకికసుఖములకేగాక పాపవిమోచనార్థంబుసైత మీబల్యర్పణమేర్పడినటు లగపడుచున్నది. బలులిచ్చినపుడు దైవమువచ్చి యారగించెనని హెబ్రూల మతగ్రంథములో గాథయున్నది. ప్రపంచంబునందెల్ల నీ బల్యర్పణములు నున్నవిగాని క్రిశ్చియనులలో నంతగలేవని కొందఱాడుదురు నిజము. అయితే క్రిశ్చియనుల దైవమగు క్రీస్తు జనుల పాపవిమోచనమునకై దైవప్రీతిగ తనశరీర బలియిచ్చుకొన్నాడు. బల్యర్పణ మంతకంటెను హెచ్చగునది యెద్దియునులేదు. కావున యీ బల్యర్పణ విధి ప్రపంచమంతయు వ్యాపించుననుట కేసందియంబునులేదు. ఆగమవిధానములు భిన్నములుగనుండినను నుండనిండు. దీనినిబట్టి సమస్తమతములందును నీ మత విధియు సామాన్యముగనున్నది. కావున మతములందీ విషయమునఁ దరతమములు లేవని నిర్ధరింపనగును. స్తుతులు బల్యర్పణములు నతిపురాతనములనుటనిస్సందేహము. అయితే వీనినొనరింపఁదగిన క్రమములు ( Rituals ) నూతనములు గాకపోయినను స్తుతులబలెఁ బురాతనములుకావు. పురాతనమతములలో నీ యాగమ విధానములులేవు. ఈ యాగమవిధానములు పురోహితుల యేర్పాటులని మత గ్రంథములఁ జూచినవారెల్లరు గ్రహింతురు. వేదములలో నేమి జన్దవస్థలోనేమి యాగమవిధులు పలుకంబడినవి. జ్యూలమత గ్రంథములోసైత మీ యాగమాచరణ లొనర్పందగిన క్రమములు వచింపఁబడినవి. బౌద్ధులేమి క్రిశ్చియనులేమి యీ యాగమవిధులు నిర్ధరించిరిగాని నిరాకరింపరైరి. మతసారము మన్నుఁగలసిపోయినను నాగమాచరణము మాత్రము హెచ్చగుచున్నది. సంధ్యావందనము రాకపోయినను ముక్కుపట్టుకొనుట ముఖ్యమైనది. శబ్దార్థములు వేఱయినవి. జనుల నడవడికలు వేఱయినవి. చిక్కులు బలమైనవి. స్తుతు లొకానొక సమయమున హృదయమునఁ బుట్టి హఠాత్తుగ జిహ్వనుండి వెడలుటకు బదులుగ శాస్త్రమునకుఁజిక్కి ఛందస్సుకు లోఁబడి యుచ్చారణక్రమమేర్పడి స్వాతంత్ర్యముగోల్పోయి చిక్కులపాల్పడినవి. పార్శీలు, ప్రాతఃకాలము లేవగనే దేవునిస్తుతింపవలెననియు భోజనాపూర్వము భోజనానంతరము పడకకుఁబోవునప్పుడును గోళ్లు వెంట్రుకలు కత్తిరించుకొను సమయమునను శైవస్తుతు లొనర్పుటయగాక త్రికాలములందును సూర్యస్తుతు లొనర్ప

వలెనని యాగమవిధు లేర్పడెను. జ్యోతులు లేచిన క్షణముననె దైవప్రార్థన యొనర్ప వలెననియు యొకవిధమగుబట్టలు తొడుగవలెననియు యొక్క విధముగ బట్ట లుదుకవలెననియు విధులేర్పడెను. ముసల్మానులు మక్కాదిక్కున మొగమయి దిన మైదుతూరులు దైవప్రార్థనలు సేయవలెననునది నిర్బంధమాయెను. హిందువు లీవిషయమున నెన్నిచిక్కులలోఁ జిక్కిరో నేఁ దెలుపునది యనవసరము. కొన్ని యాగమాచరణ లొనర్పఁ బురోహితులేర్పడిరి. మెక్సికన్ల దేవాలయములలో దిన మును నాలుగుతూర్లు పూజలొనర్ప పూజార్లేర్పడిరి. క్రిస్టియన్ల దేవాలయము లలో ప్రాతఃకాల సాయంకాలములందు ప్రార్థనలొనర్చుట యీ యాగమాచరణకు లోఁబడిన విధానమేను. పైన వ్రాయఁబడిన విషయములుగాక పవిత్రకార్యములని సర్వమతములవారు నొనర్చు నాగమవిధులు మఱికొన్ని యున్నవి. వాని పేర్లుమాత్ర మీ క్రింద వివరించినాను.

[1] ఉత్సవములు, పండుగలు, ఉపవాసములు, జాగరణములు, జాతకర్మ, నామకరణ, వివాహ, గర్భాధానములు, మరణ మీ యన్ని కర్మములు మతవిధులకుఁ జేరినవేను అన్ని మతములలోను నీవిధులు సామాన్యముగ నున్నవి. ఆచరణక్రమ ములు వేఱుగనున్నవి.

ఇఁక మూఁడవతరగతికిఁ జేరిన పవిత్రస్థళములనుగుఱించి యించుక వ్రాసెద.

అనేకవిధములగు పవిత్రకార్యములొనరించునది ప్రాచీనజనుల ముఖ్యోద్దేశము. దానికిఁ గారణంబు దైవములతో సంబంధముఁ గల్పించుకొనుట. దానికిగాను స్తుతిబల్యాదివిధుల ననుసరించుటయగాక మఱి కొన్ని మార్గములు వెదకికొనిరి. పైరీతిగమతాభిప్రాయములు హెచ్చినపిదపఁ బ్రాచీనజనులా యభిప్రాయములకుఁ దగినరీతిగఁ గొన్ని స్థళములను కొన్నివస్తువులను కొందఱుమానవులను పవిత్రులుగ నొనర్చిరి. దైవారాధనలకుఁ దగినవనికొన్ని స్థళములేర్పఱచి యందు దైవములను నిలిపిరి. ఆస్థళములందొనర్పఁ బడినకార్యము లతిపవిత్రములని తలంచిరి. దైవ ములతో సంబంధముగఁ లుపుకొనుటకు నవిపావనస్థానములని యెన్నిరి. ఈస్థళము లేర్పరుప సకలమతస్థులు సకలవిధములనిప్పటికిని యత్నించుచున్నారు. తమధ నమును వెచ్చించుచున్నారు. అట్టిపవిత్రస్థళములం దేచెడుకార్యములు జేయను భీతిలుచున్నవారు. సాలోమన్‌రాజు హెబ్రూవారు దేవాలయము గట్టించునపుడు స్థళ శుద్ధికిగాను 22000 ఏఁబ యెద్దులును 12000 వేలగొఱ్ఱెలను - నాస్థళమునందు

జంపెనఁట. పిదప దేవాలయముగట్టి "జహోవా! ఈ పవిత్రస్థలమున నివసింపుము. ఇచట జనుల మొరలాలకింపుము" అనిప్రార్థించెనఁట. ఇజరయెల్టు యిప్పటికి నాస్థలమతి పవిత్రముగఁజూచుచున్నవారు. పోంపేయాస్థలమున జెఱపనటులొనరించినవారి సాహసము చరిత్రలు చదివిన వారికివిశదమగును. మెక్సికనులు పెరూవియనులు హిందువులు క్రిస్టియనులు నీదేవాలయములనుగట్టి నెంతద్రవ్యమును వెచ్చించిరో దైవమునకే దెలుసును. పూర్వకాలంబున హిందువులు గట్టిన దేవాలయములు దేహాతత్వమును దెలుపును.

## పవిత్రవస్తువులు.

దేవాలయములోనిదైవములకును గృహదేవతలకును భక్తిపూర్వకముగభక్తులు, విశేషమగుద్రవ్యము, సొమ్ములు, పాత్రసామానులు, వస్త్రములు, భూములు, విగ్రహములు, పటములు మొదలగునవి యిచ్చుచున్నారు. ఈవస్తువులతి పవిత్రములుగనెంచి యెవరును వానినిహరింపయత్నింపరు. కొన్నిదేశములందు శక్తులపేరిటపోతులను నెద్దులను స్వేచ్ఛగవిడుచుచుందురు. వానినెవరునేవిధముగ నుపయోగింపఁగూడదు. అవిచేనులు దూరి పంటలు చెడుపుచున్నను వానినేవిధముగదండింపఁ గూడదని జనులలోనిబంధన. టార్టారువారు తమ దైవములపేరిట గుఱ్ఱములను వదలుచుండిరి.అట్టి గుఱ్ఱముల నెవరునెక్కఁగూడదు. ఈరీతిఁ బ్రపంచంబు నందెల్లెడ దైవములపేరట వస్తువిశేషములనేకములు వదలంబడి పవిత్రములయి జనులపూజలకు నర్హతఁగనెను. కొందఱట్టివస్తువులఁ జూచిదైవములేయవియని నమస్కరించి గౌరవించుచున్నవారు; మతతత్త్వమనేక రూపములు గొనెననుటలో నిదియొకటి. ఈతర గతి క్రిందనే యింకను ననేకవిధములున్నవి. దైవమునకనిపేరిడినంతనె వస్తువులందు దైవావేశము కలుగుచున్నదని నమ్మకము.బలులిచ్చినతోడనే దైవముఁభుజించును. వస్తువులిచ్చినచో దైవము తన యుపయోగమునకు దాఁచికొని యుండునని జనుల దృఢాభిప్రాయము, అతిథికినాహారమిడిన భుజించును. వస్తువులను బహుమానముగ నొసంగినవానిని దాఁచిపెట్టును. అటులనేదైవము జేయునని ప్రాచీనజనులు నమ్మిరి.

ప్రారంభమునఁబురాతన మానవులు దైవమున్నవాఁడని ప్రకృతి మహిమలఁజూచి యామహిమలకుఁ గర్తయొకఁడుండునని యూహించిరి. పిదపమనుష్యువాఁడని నిర్ధరించిరి. వానినిస్తుతించిరి. ఆహారాదులు బలులరూపకముగ నొసంగిరి నివసింపనాలయములనిచ్చిరి. కట్టనుబట్టలిచ్చిరి. తొడుగభూషణములిచ్చిరి. ఎక్కఁగు

వాహనములిచ్చిరి. ఇంక స్నేవింప సేవకులు కావలసియుండెను. వారేపవిత్రమాన వులుగ నేర్పడిరి. వీరిలోఁ గొందఱుస్వేచ్ఛగ దేవదాసులైరి. మఱికొందఱు జనులచే నిర్బంధింపఁబడి పావనులైరి. స్వేచ్ఛగఁబవిత్రులయినవారి సంఖ్యవిశేషముగ నున్నది. ఇండియాలోని ఋషులేమి, చైనా, సిలోనులలోఁ బసుపుబట్టలుధరించు జ్ఞానులేమి జ్యూజాతివారిలోనుండిన "యిస్సనీస్స" నువారేమి, ఆఫ్రికా ఏష్యా యూరోపులోనుండు "Monks & Nuns" యేమి యీతరగతికిఁజేరినవారేను. ప్రపంచంబుననుండు జనులకనేకులకు నీరీతిగఁ బవిత్రపురుషులు కావలెనను శతాబ్ది ప్రారంభమున పశ్చిమఖండములోని ముఖ్యపట్టణములోని గొప్పవీథులలో నస్సి గుండములుం బతితమఠములోఁ జేరని వారిని బలవంతముగఁబట్టి తెచ్చియస్నిలోఁ బడవైచుచుండిరఁట! కొందఱిని గాలమునకు దవిలించుచుండిరి. మొనలుగలమేకులను జెక్కిన పీపాయిలోఁగొందఱిని వైచివీథులగుండా ద్రిప్పిపంపుచుండిరి. కొందఱిని శూలముల బాధించుచుండిరి. ఈరీతిగఁ బదునాఱవశతాబ్దాంత్యముపరకుఁ దమమత మతవ్యాప్తికిగాను జనులు పెఱమతము వారినిఁ జిత్రహింసలు పెట్టుచుండిరి. ఏనవు వారియందేజ్ఞానముప్పవిల్లిమతవాదములు పిచ్చిపిచ్చిగఁ బెఱుగనీయక కలహాముల నాపి యిపుడుసుఖముగనున్నవారు.

ఋగ్వేదమట్టు కలహములకు దిగక, జనులను బాధింపక, యెవరికి నే హింసలిడక బహుపురాతనకాలమునుండి యొక్కవిధముగఁ జెన్నారుచున్నది. పురాతనార్యులు దస్యులను బాధించిరనిన నందులకుఁగారణము మతముకాదు. సుఖవృత్తిని జీవించు నార్యులపైబడి దస్యులు హింసించునపుడు వారి క్రూరకృత్యములకు సైఁపనోపక యార్యులు తమప్రాణరక్షణమునకునై దస్యులతోఁబోరి వారినినోడించి, వారినే మఱలఁ దమసేవకులుగఁగైకొని వారిదుర్వృత్తినిఁ బోకార్చి కృషివాణిజ్యాది కర్మములు వారికిఁగఱపి వారికిని విద్యాబుద్ధులను నాగరికతయు నేర్పిరి. సులభమగునట్టియు యమహాయకమగునట్టియు శుద్ధమగునట్టియు వేదమతమును దూలనాడి.యిటీవల జనుల బుద్ధికౌశల్యమునఁబుట్టి పెక్కుచిక్కులలోఁ జిక్కినమత విధులనుఁగైకొని వైషమ్యవిశేషమున ద్వేషములుబెంచుకొని నైకమత్యమును విడనాడిరి.

# ప్రకటన.



బళ్లారిలో వకీలుగానుండి కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీక్రింద వివరించిన యుపన్యాసములన్నియును విక్రయమునకుసిద్ధముగనున్న యవి.

| | | |
|---|---|---|
| 1. | ఆర్యుల నాగరికత వారి ప్రపంచవ్యాపకత. | 0-8-0 |
| 2. | ఆర్యుల చరిత్ర, ఋగ్వేదభాష మొదలగునవి. | 0-8-0 |
| 3. | ఋగ్వేద విభజన వేదకాల విభజన మొదలగునవి. | 0-8-0 |
| 4. | ఆర్యులుపంజాబు చేరిన విధము వారిశాసనము. | 0-8-0 |
| 5. | మద్యపానము జూదము స్త్రీలగుణములు మొదలగునవి. | 0-8-0 |
| 6. | వివాహశట్టడములు ... | 0-8-0 |
| 7. | జాతిచట్టములు ... | 0-8-0 |
| 8. | సృష్టిని గుఱించిన తాత్పర్యము. | 0-8-0 |
| 9. | వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు. | 0-8-0 |
| 10. | నరమేధ అశ్వమేధాది యజ్ఞములు. | 0-8-0 |
| 11. | అదితి ద్వాదశాదిత్యులు మొదలగునవి. | 0-8-0 |
| 12. | యమ యమి మృత్యువు పితృదేవతలుకర్మ మొదలగునవి | 0-8-0 |
| 13. | సోమపానము అశ్వినులు రుద్రుఁడు పర్జన్యుఁడు. | 0-8-0 |
| 14. | ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుఁడు మొదలగునవి. | 0-8-0 |
| 15. | ఋగ్వేదములోని ముఖ్యప్రార్థనలు | 0-8-0 |
| 16. | మతవిధులేరీతిగఁ బ్రబలినది ... | 0-8-0 |

వలయువారు ఈక్రింది చిరునామాకు వ్రాయవలయును.

కె. శతృఘ్నరావు,

సివిల్ లైన్సు, బళ్లారి.